సంపుటము 3] జనవరి 1917 [సంచిక 7

# బాలమిత్ర

## సౌఖ్యదాయకమగు నూతనవత్సరము

నా ప్రియబాలమిత్రులారా!

ఈ చిన్నపుస్తకమును దెచ్చు ప్రతి బాల బాలికకును సౌఖ్యదాయకమగు నూతనసంవత్సరము కలుగునుగాక! బాలమిత్ర మీ చేతి కందునప్పుడు క్రొత్తసంవత్సరము కొంత పాతబడవచ్చును. బాలమిత్రను జదువు ప్రతిబిడ్డను నాకొక సంగతినిగూర్చి వాగ్దత్తము చేయగోరుచున్నాను. క్రొత్తయేడగు 1917 సంవత్సరమునందు, ప్రతి ఉదయమున లేవగానే, "నా ప్రియతండ్రివైన దేవుడా! ఈ దినమునందు నేను మంచిపిల్ల (వాడ)నై యుండునట్లు నీ సహాయ మిమ్ము. నేను కీడు చేయకుండునట్లు నా మనస్సును మళ్లించుము. మనుష్యులందరియెడలను, జంతువులయెడలను, దయగలిగి యుండునట్లు సహాయ మిమ్ము. నిన్ను ప్రేమించి నీకు నమ్మకమైన సేవ జేయునట్లు నాకు నేర్పుము. ఆమేన్" అని ప్రార్థింతువా? ఈ ప్రార్థనను ప్రతిదినమును జేసి, దాని ప్రకారము నడచినయెడల ఈ సంవత్సరము నికు సౌఖ్యదాయకమగును. ఇట్లు నీ ప్రియహిత

పత్రికాధిపతి

# చీనా దేశము

ప్రియ పిల్లలారా!

లోకములోని దేశములలో నేది పెద్దది? ఏ దేశములో నెక్కువమంది జనులున్నారో తెలియునా? చీనా దేశము! అంత పెద్దదేశమగు చీనానుగురించి కొంచెము విందురా?

మన దేశపువాడుకలకు చాల వేరువాడుకలు వారికున్నవి. మార్గమం దెవరినైనను స్నేహితులను మన మెదురుకొన్న యెడల నమస్కారమనిగాని సలామనిగాని అందుము. గాని వారు వంగి "మీకు మంచి ఆరోగ్యము కలుగునుగాక" అందురు.

మనలో పిల్లలను చంకనెత్తుకొందును గదా. వారు ఎరుకలవారివలె నొక జోలెలో బిడ్డనువేసికొని వీపుకు కట్టుకొందురు. వారిలో పురుషులు తలవెండ్రుకలను జడవేసికొని వీపున వ్రేలాడనిత్తురు. స్త్రీలు జడవేసికొనక కొప్పుగాచుట్టుకొందురు. వారిలో నెక్కువమంది అంగుళము పొడుగువరకు గోళ్లను పెంచుకొందురు. తమ చేతులతో నెట్టిపనిని తాము చేయ నక్కరలేదని తెలుపుటకు ఈలాగు పెంచెదరట.



వీధిలో నెదురుపడినపుడు చీనావా రొండొరులకు చూపు మర్యాద

గోళ్లను కత్తిరించుకొనువారు కూలివారని వారిలో వాడుక. వారికండ్లు మన కండ్లవంటివిగాక ఏటవాలుగా నుండును.

వారి వాడుకలలో దురలవాటేదనగా, స్త్రీల పాదములను ఎదుగనీయక కట్టివేయుటయే. మంచిభాగ్యవంతురాలి


చీనా స్త్రీయొక్క బంధింపబడిన పాదము

పాదము 3 అంగుళములకంటె పొడుగుండదు. ఆమె ఎక్కడి కైనను బోవలసి యున్న యెడల, నడువ నక్కరలేక పల్లకీమీద బోవలెనని తెలుపుచున్నది. ఈ క్రూర ఆచారమును ఆపుటకు దొరతనమువారు మంచి కట్టు దిట్టములనుచేయ ప్రయత్నించు చున్నారు.

మనవలె చేతులతో తినుటకుబదులు మనము వ్రాసికొను పెన్సిలంత పొడవుగల రెండుపుల్లలతో వారు భోజనము చేతురు. తేనీరు వారికి బహుయిష్టము గనుక దినమునకు 6 లేక 7 మారులు దానిని త్రాగెదరు.

చీనాలోని బీద ఆడుపిల్లల స్థితి బహు విచారకరమైనది. వారి తలిదండ్రులు వారిని బానిసలుగా భాగ్యవంతులకమ్మె దరు. ఈ చిన్నపిల్లలకొరకు మనము ప్రార్థింతము.

ఆ దేశస్తులకు మన ప్రియ ప్రభువైన యేసుక్రీస్తు కావ లసియున్నాడు. వారాయనను తమ ప్రభువుగా నంగీకరించిన



చీనా బాల బాలికలు

యెడల తమ ఆడపిల్లలను అమ్మరు. స్త్రీల పాదములను బిగించి కట్టరు. చాల వేల సంవత్సరములనుండి చీనావారు పితరుల నారాధింతురు. వారిప్పుడు దేవుని వెదకుచున్నారు. వారా యనను కనుగొని ప్రేమించునట్లు ప్రార్థింతము.

---

# ముసలికోతి, దాని ముగ్గురు బిడ్డలు

ఒకానొక కోతిగలదు. దానికి సుబుద్ధి, భక్తి, ప్రేమయను మూడు పిల్లలుండెను. ఈ తల్లికోతి చాల ముసలిది.

దీనికి మరణమును సమీపించెను. చావక ముందది తన బిడ్డలకు మంచి బుద్ధిమాటలు చెప్పదలంచి వానిని దగ్గరకు బిలిచెను. పెద్ద బిడ్డయగు సుబుద్ధితో "అమ్మా నీవు మంచి పిల్లవుగా నుండవలయునని కోరుచున్నాను. ఎవరైనను చెడ్డ పలుకులు పలుకుచున్నప్పుడు నీకు వినబడకుండునట్లు నీ చెవులను మూసికొనుము" అని చెప్పెను. ఆ పిల్లకోతి తల్లిమాటలువిని, "అమ్మా! నీవు చెప్పినట్లే చెడ్డమాటలు వినకుండ నా చెవుల నీ విధముగా మూసికొందును" అని జవాబిచ్చెను.



పిమ్మట భక్తియను రెండవపిల్లను బిలిచి, తల్లి ప్రేమతో ముద్దుబెట్టుకొని "నీవు మంచిబిడ్డగానుండ గోరుచున్నావా"? అని యడిగెను. అవునని యా పిల్ల చెప్పగా తల్లి, "అమ్మా నీవేదైనా చెడ్డకార్యమును జూడవలసి వచ్చినప్పుడు నీ రెండుకండ్లను మూసికొనుము ఎందుకనగా నీవు దానిని చూచినయెడల నీవును అట్టి



కార్యములో పాలిదానవగుదువు” అనెను. ఆ పిల్లయు, తన అక్కవలెనే, ఏ చెడ్డకార్యమును తా జూడకుందునని తన తల్లికి ప్రమాణముజేసి తన రెండుకండ్ల నీలాగు మూసికొందునని జూపెను.

తరువాత తల్లి, ప్రేమయను తన చిన్నకూతురును బిలిచి, కౌగిట జేర్చిపట్టి, ముద్దుబెట్టుకొని, సంతోషముతో గూడిన ముఖముగలదై ఇట్లనెను. “అమ్మా, నీవు చాల చిన్నపిల్లవు. నీ యక్కలవలెనే మంచిదానవుగా నుండవలెనని మిగుల కోరుచున్నాను. నా కడసారికోరిక ఏదనగా నీ స్నేహితులుగాని యితరులుగాని నీ నోటచెడ్డమాటలాడించ ప్రయత్నించిన యెడల, నీ నోరు మూసికొనుము” అనెను. అందుకా చిన్నకోతి, ఆలాగే చేతునని చెప్పి, నోరు మూసికొని జూపెను.



ప్రియ పిల్లలారా! మీరు ఈ చిన్న కోతిపిల్లలవలె ఏ విధమైన చెడుగుకు చోటియ్యక తలిదండ్రులు చెప్పు మంచి మాటలకు లోబడుడి.



# చిలుకమ్మ పెండ్లి

చిలుకమ్మపెండ్లికి ♦ సింగారముంచిరి
చెలికత్తెలందరిని ♦ పిలుచుకొనివచ్చిరి
సాలీపురుగులు ♦ చాపులుదెచ్చిరి
సీతాకోకలు ♦ చీరెలుకట్టిరి
కప్పలుబెకబెక ♦ డప్పులుకొట్టిరి
కాకులమూకలు ♦ కేకలువేసిరి
వాకిటాకోళ్లు ♦ బాకాలూదిరి
పందిటపిచ్చుకలు ♦ సందడిచేసిరి
కోవెలలొక్కచో ♦ కూర్చుండి పాడిరి
నెమలీసానులు ♦ నృత్యముచేసిరి.

చిలుకమ్మ ♦ మగడంత
చిలుకత్తు ♦ కట్టి
చిరునవ్వు ♦ నవ్వుచు
చెంత కూ ♦ ర్చుండె

---

# ప్రకృతి పాఠములు

## 29-వ పాఠము




చూపు

మెదడునకు విశేషముగా చూపుద్వారాను వినికిడిద్వారాను సంగతులు తెలియుచున్నవి. ఈ పాఠములో చూపు దేనివలన కలుగునో ఆ యింద్రియమునుగూర్చి నేర్చుకొందము.

కన్ను బహుచక్కని యింద్రియమువలె నున్నది. దానిలో ననేక వివిధభాగములు గలవు. ఈ భాగము లన్నిటినిగూర్చి నేర్చుకొని గ్రహించుకొనుటకు నీకు కావలసిన వయస్సు లేదు. గాని కొన్నిటిని బాగుగా గ్రహించుకొనగలవు.

ఎవరిదైనా కంటిని బాగుగా చూడుము. లేక అద్దము ఎదుటపెట్టుకొనియైనను చూచుకొనవచ్చును. తెల్లగుడ్డు అని చెప్పబడునది ఒకతరహా సంచి. దానినిండ గుజ్జువంటి పదార్థమున్నది. ఇది ఉన్నందుననే తెల్లగుడ్డు గట్టిగానున్నది. దానిలో ఏమియు లేకపోయినయెడల వట్టిసంచివలె నుండును. కంటి యొక్క ముందుభాగములో మంచి కిటికీయొకటి గలదు. వెలుతురీ కిటికీగుండా లోనికి బోవును. దీనిగుండానే బోవును గాని వేరొక మార్గము లేదు. ఈ కిటికీలో గుండా కన్నుగ్రుడ్డులోపల జూడవచ్చును. గాని చీకటి గదిలోకి చూచి నట్లుండును. లోపలనున్న నల్లని భాగమువలన చీకటిగా కనుపడును. ఇట్లుండనియెడల వెలుతురు ఎక్కువగానున్నయెడల కండ్లు చెడిపోవును.

ఈ కిటికీ వెనుక భాగములో నీటివలె నిర్మలముగా నున్న ద్రవపదార్థ మొకటి యుండును. ఈ ద్రవమునందు ఒక తరహా గుండ్రటి తెర యుండును. దీనికి కనుపాప అని పేరు. ఇది వెలుతురు కంటియొద్దకు తెచ్చినయెడల చిన్నదగుచు, దూర

మునకు తీసికొని పోయినయెడల పెద్దదగుట చూడవచ్చును. అదెల్లప్పుడు ఒకటేమాదిరిగా నుండదు.

ఈ కనుపాప అందరికి ఒకటేమాదిరిగా నుండదు. కొందరికి నీలిరంగుగాను, కొందరికి, నల్లగాను, ఇంకా అనేకరకములుగా నుండును. కొందరికి పిల్లికండ్లని చెప్పుదుము.

ఇట్టి వింతైన కిటికీ నెవరు చేయలేరు. దీనిపని చిత్రముగా నుండును. దానినిగూర్చి వచ్చేపాఠములో చెప్పెదను.

---

# ఒక సర్కసు ఏనుగ స్నానము

ఒక సర్కసు ఏనుగను స్నానముచేయించు టెంత కష్టమైనదో తెలియునా? దాని జన్మస్థానమునందది లోతు చెరువులలోను సరస్సులలోను స్వయముగా చేయునుగాని, దానిని పట్టుకొని మచ్చిక చేసినపిదప స్నానము చేయించు టెంతో కష్టమైన పని. దానికి బాగా స్నానము చేయించుటకు సుమారు 900 రూపాయలు పట్టుననినయెడల ఎట్టి కష్టమైన పనియో వారికి తెలియును. ముగ్గురు మనుష్యులకు ఒక వారము దినములు పట్టును. మొదట శ్రేష్ఠమైన సబ్బుతో దానిని తోముదురు. ఒక్కదానిని తోముటకు 150 పౌనుల సబ్బు పట్టును. అన్నిటికంటె దాని చెవులను శుభ్రముచేయు



టకే ఎక్కువ కాలముపట్టును. సబ్బుతో తోమి ఎండబెట్టిన పిదప నునుపుజేయు కాగితముతో చర్మమును రుద్దుదురు. తరువాత మంచి శ్రేష్ఠమైన నూనెను పూసి, దాని చర్మము మెత్తబడి నిగనిగ లాడునట్లు చేసెదరు. నూనెతో రుద్దుటే అన్నిటికంటె ఖర్చుపని. దానికై 450 రూపాయలు ఖర్చగును. గాని యింత ఖర్చగునే అని దాని యజమానులు తలంచరు. అది ఆరోగ్యకరముగా నుండవలెనన్న ఈలాగు స్నానము చేయించుట చాల అవసరము. ఇంత తోమినను ఏనుగ చాల సహనముతో నుండును. ప్రతిదినము అట్టిపని జరుగదను నమ్మకము దానికి గలదు.

# బైబిలు పిల్లలు

## మిర్యాము

(నవంబరు సంచిక కొరకు)

మిర్యాము చెప్పినమాట సమయోచితముగా నుండెను. ఏమని చెప్పినది? ,,అమ్మా! ఈ పిల్లవానికి ఆకలై యేడ్చుచున్నాడు. మీరు సెలవిచ్చినయెడల ఒక దాదిని పిలిచి కొని వచ్చెదను.” సరే నని రాజకుమార్తె అన్నది. వెంటనే మిర్యాము పరుగెత్తి తనతల్లిని పిలుచుకొనివచ్చినది. ఎంతమంచి ఉపాయము! భయకంపితురాలైన తల్లి, సంతోషముతో పరుగిడుచు వచ్చినది. కుమార్తెయొక్క తెలివికి వందనములు చెల్లించినది. బిడ్డ యిక బ్రతికినాడుగదా యని దేవునికి వందనములు చెల్లించెను.

తమ్ముని గారాబముతో జూచుకొనెను. గాని ఎల్లకాలము వానితో నుండలేకపోయెను. తమ్ముని రాజకుమార్తె తీసికొనిన తరువాత తల్లికిచాల సహాయకారిగా నుండెను. ఇదేలాగున ప్రతిబాలిక చేయవలెను.

దేవుడు ఇశ్రాయేలీయులను విడిపించి ఎర్రసముద్రమును దాటించిన పిదప ఆమె స్త్రీలనందరిని కూర్చుకొని మంచి

కీర్తనపాడి దేవుని కీర్తించెను. వారిని నడిపించెను. తరువాత దేవునికి గుడారము కట్టుటకై సామానులు సంపాదించుట లో చాల సహాయకారిగా నుండెను. దారముతో చేయగలి గిన పనిజేసెను. గాని ఆమె ఒకసారి మోషేమీద విసుకు కొనెను. మోషే చాల మంచివాడు గనుక దేవుడామెను గద్దించెను. ఆమెకు కుష్ఠువచ్చెను గాని మోషే అక్కగారిని చాల ప్రేమించినందున చాల దుఃఖపడి దేవుని వేడగా ఆయన మోషే మనవినాలకించి ఆమెను స్వస్థపరచెను. మిర్యాము చాలకాలము జీవించెను. ఆమెను జనులు బహుగా ప్రేమిం చిరి. ఆమె చనిపోయినప్పుడు ఆమెకొరకు చాలదినములు దుఃఖించిరి. పిల్లలారా మన పనులచేత దేవుని ఘనపరచి ఇతరులకు ప్రీతికరముగా జీవించవలెను.

---

# బాలమిత్ర టపా

ప్రియ బాలమిత్రులారా!

నేను ప్రతినెలయును ఈ పత్రికలను చదువునప్పుడు నాకు యెక్కువ సంతోషము కలుగుచున్నది. నేను మీతో కొన్ని సంగతులు తెలుపగోరుచున్నాను. మా బడిలో 80

మంది బాలికలు విద్య నభ్యసించుచున్నారు. మాలో కొందరు హిందూ బాలికలు కూడ విద్య నభ్యసించుచున్నారు.




మమ్ము నింతవరకు కాపాడినటువంటి మా ప్రియ డ్రేపర్ మిశమ్మగారు మమ్మును విడచి ఫిబ్రవరినెలలో తన స్వదేశమునకు వెళ్లెదరు. మరియొక క్రొత్త మిశమ్మగారు వచ్చెదరు ఇప్పు డుండినటువంటి బడిపైన ఒక అంతస్థును కట్టింప నుద్దేశించి యున్నారు. డిసంబరునుంచి ఆరంభించెదరు. మేము చాలమట్టుకు నీతివాక్యములు నేర్చుకొనుచు, మంచి మర్యాద జ్ఞానము తెలివి పొందుచున్నాము.

నేను మాయొక్క ఇంటర్ మీడియెట్ సొసైటిలో చేరియున్నాను దానిగూర్చి చెప్పవలెనని కోరుచున్నాను. నేను చాల ఆత్మీయపాఠములు నేర్చుకొనియున్నాను. మాలో కొంతమంది దేవుని పనినిమిత్తము పాటుపడుచున్నారు. ఎట్లన వారు ప్రతి ఆదివారము ఆస్పత్రికి వెళ్లి రోగులను ధైర్యపర్చుదురు బీదల పోషణార్థమై పాటుపడుచున్నారు. మేము లోకములో వెలుగు బిడ్డలముగా బ్రతుకునట్లును మా హిందూ బాలికలకొఱకు ప్రార్థించమని చేయుచున్నాను.

దీనిని చదువు వారందరికి నా పెక్కు వందనములు.

ఇట్లు

బాలమిత్రురాలు, యస్. రూతమ్మ,

ఎ. బి. యం. గర్ల్స్ హైస్కూల్,

నెల్లూరు

పట్టణము పట్టుకొనువానికంటె తన మనస్సును స్వాధీనపరచుకొనువాడు శ్రేష్ఠుడు!

C. L. S. PRESS, MADRAS—1917